ావు. కర్ణుడు శకుని చెప్పిన మంతనాలు నచ్చి అలా ప్రవర్తించావు
ాతుృలయినవారితో విరోధం తెచ్చుకొన్నావు. దానికి ప్రత్యుపాయం
ుల చెప్పాలి నీకు– ఇతర్లేం చేస్తారుగాక అన్నారు.

ిదురుడు "ఇప్పుడు మాత్రమేమయింది. నేను ప్రత్యుపాయం
ఆ పాండవుల్ని ఇప్పుడు పిలిపించి వారు అరణ్యాలకు వెళ్ళ
వసి వెళ్ళి తమ రాజ్యం తాము ఏలుకొనవలసిందనీ చెప్పరాదా!"
ు. ధృతరాష్ట్రుడు ఆ మాటలు విననట్టుగా ఊరుకొంటాడు. పాండ
అరణ్యవాసులవుతారు.

సభాపర్వంలో పాండవులు మహోన్నతినీ అందుకొంటారు. మహా
న్ని పొందినవారవుతారు. శ్రీ కృష్ణుడు తమతో ఉన్నంతకాలం
న్నతినే అందుకొంటూ ఉంటారు. ఆయన వెళ్ళిం తరువాత జూదం
ండ మాస గలిగినంత స్థైర్యం ధర్మరాజుకు లేకపోయిందనాలా?
తమ్ముళ్లకూ ద్రౌపదికీకూడ ఆ మాత్రం సలహా ఇవ్వాలని తెలీ
ా. ఇది భగవచ్ఛైద్రమని సరిపెట్టుకోవాలా? భగవచ్ఛైద్రయిదమనేది
ాకావచ్చు. కాని దానికి కూడ లౌకికంలో కార్యకారణ సంబంధం
ద్దా? నిన్నటివరకూ ధర్మరాజుకు కలిగింది కేవలం అదృష్టమే తప్ప
తేటలు కాదా? అయితే అవి ఇప్పుడెలా నశించినయి అని సందేహాలుద
స్తవి.

అది ద్యూతం కనుక ఒకసారి ఒకరు గెల్చినా ఈసారి నేనే గెలువ
ునే ఊహ రావటం సహజం. శకునికి అక్షవిద్య తెలుసునన్న సంగతి
ురాజుకు తెలీదు. రెండవసారి ద్యూతానికి పిలుచునప్పుడైనా పాండ
ు ఆ సంగతిని తెలిసికొని యుండవలసింది. ఒకప్పుడు అంగారపర్ణ
గంధర్వునితో అర్జునుడు యుద్ధంచేసి గెల్చినవుడు అంగారపర్ణుడు
కు చాక్షుసి విద్య వచ్చుననీ దానిని ఉపదేశిస్తాననీ అన్నాడు. అప్పుడు
స్తనుడు దానిని పొందనన్నాడు. అది తెలిసి యున్నట్లయితే ఈ ఓటమి
ిపోయేదేమొ,

ఒక కార్యానికి కారణమేమిటని చెప్పటం కార్యకారణ సంబంధం గ్రహించి ఫలాన అని చెప్పచ్చు. అది ఇంకా ఇతర కారణాలవల్ల కూడ అయి ఉన్నప్పుడు ఆకారణాలన్నీ మనం తెలిసికోలేక "మాయ" అంటాము. 'భగవంతుడు' 'విధి' అంటాము. దైవం అనే దానికి సంబంధించిన భావాలు అలా మనలో కలుగుతవి. అతడెక్కడో మనలోనె అంతరాంతరాల్లో ఉన్నాడని అంతర్దృష్టిని సంతరించటం ఆరంభిస్తాము. వ్యాసుని ఆశయం ఇదెనేమొ.

ఈ ద్యూతం, వస్త్రాపహరణం. అరణ్యవాసాలను కథలో ఇలా అమర్చి తెల్పుతూ వ్యాసమహర్షి ఆధ్యాత్మిక రీత్యా సాధకుడు తనలోని సాత్త్వికవృత్తులతో ప్రకాశింపుతూ మోక్షస్థితిని పొందాలని ప్రయత్నం చేయాలి అనేది స్థిరీకరించుతున్నాడనిపిస్తుంది. సాత్త్వికవృత్తులైన పాండవులు ప్రకాశము అనే అర్థం కలిగిన "ద్యుతం" అదే 'ద్యూతం'లో పాల్గొని తమ ఐహిక బంధాలను ఒక్కొక్కటే పణంపెట్టి వదిలించుకొన్నారనేది గమనీయం. చరాస్తి స్థిరాస్తి చివరకు తమ్ములు అనే బాంధవ్యం సర్వమూ వదలినారు. అనగా సాధకుడు మోక్షం కావాలనేకోరిక మినహా అన్ని కోరికలనూ వదలినారని అర్థం. చివరకు ఆత్మత్యాగం చేస్తూ తనను తాను ధర్మరాజు ఆత్మత్యాగం చేశాడు.

ఇది తప్పు. మోక్షకాంక్షకూడ నశిస్తేనేగాని ఆత్మత్యాగమనే యజ్ఞం పరిపూర్తికాదు. ద్రౌపది "ముక్తితపస"కు ప్రతీక. ఆమెను ముందుగా ఓడిపోయినట్లయితె సాధన పూర్తి అయి ఉండేది అలా కాకపోవటంవల్ల సాధన మళ్ళీ మొదటకు రావలసివచ్చింది. మళ్లీ అను ద్యూతమాడవలసి వచ్చింది. సాధకుడు తిరిగి ఇంద్రియాలు పదింటినీ మనోబుద్ధులనూ శుద్ధం చేయవలసి వచ్చింది. పన్నెండింటినీ 12 సంవత్సరాల అరణ్యవాసమనే పేరుతో వ్యాస మహర్షి కథలో ఇమిడ్చి తెలిపినాడు. ఈ పన్నెండేండ్లూ తిరిగి 'అహం బ్రహ్మాస్మి' అనే మహా వాక్య సాధనను చేయాలి పాండవులు. 13 వది "సర్వంఖల్విదం బ్రహ్మ" అనే మహా వాక్య సాధనకు ప్రతీక. ఇదీ

వ్యాసుడు వేద విజ్ఞానం నుంచి ఎత్తి వ్రాసి భారతంలో కథారూపకంగా విశదీకరించిన విషయం.

ద్రౌపది 'ముక్తితపన'కు ప్రతీక. ఆమెను సభలోనికి తేవటం కథాపరమయినది. ఆమె అక్కడకు వచ్చిన తరువాత కర్ణుడు సహా అంతా ఆమెపై కోరికను ప్రదర్శిస్తారు. ఏమాత్రం సాత్త్వికబుద్ధికలవారైనా ముక్తితపన' నను ఎప్పుడో ఒకప్పుడు అనుసంధానం చేయటం తథ్యమని బోధ.

కాని ఆమె వస్త్రాలు లాగివేయటం అనేది ముక్తితపనకి చుట్టూర ఉన్న 'మాయ'ను తొలగించాలనె కించజ్ఞుల ప్రయత్నం. అది కేవలం నిర్వృతితత్త్వం చేత కలుగవలసినదెగాని దుశ్శాసనునివల్ల అయేదికాదు. అదె అక్కడి అమానుషమైన సంఘటనగా వ్యాసుడు రచించినాడు.

ఇవన్నీ పిచ్చి కథలనే వాళ్ళు తెలివిగలిగిన వాళ్ళనె చెప్పాలి గుడ్డిగా నమ్మేవారికంటె. ఈ రోజుల్లో ఈ తెలివి సర్వ ప్రపంచంలోనూ ఎక్కువయిందనేది గమనీయం. ఈ దృష్టితో విమర్శ చేయటం తద్వారా కేవలం మూఢ విశ్వాసంగాగాక, సహేతుకంగా భారత భాగవత రామాయణాల అంతరార్థ మెఱిగి శ్రద్ధాభక్తులు సాధనా మెళకువలు ఎఱుగ వలసిన అవసరం మనకున్నది. ఎన్ని వేల ఏండ్లక్రిందటనో వ్యాసుడువ్రాసిన పూర్వ గ్రంథాలపై ఇప్పుడు శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మగారు తమ గ్రంథాలద్వారా చేసిన విద్యుద్దీపం ఈ పై చెప్పిన బుద్ధివికాస విజృంభణ కారణంగానే మనకు దారి చూపటం ఆరంభించింది అనిపిస్తుంది

ఇది సభాపర్వము

ఓం తత్సత్





# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 2 | ప్రథమాశ్వము | ప్రథమాశ్వాసము |
| 29 | 2 | ద్వితీయ ఆశ్వాసము | ద్వితీయాశ్వాసము |
| 33 | 8 | అనుభవం కోసంగా | అనుభవం కోసంగాక |
| 49 | 2 | తృతీయా ఆశ్వాసము | తృతీయాశ్వాసము |
| 70 | 7 | శక్తితో | శక్తితో సహా |
| 72 | 16 | చేసుకొనుడు జనుల్ | చేకొనుడు జనుల్ |
| 103 | 21 | దీర్ఘ తపస్సు | దీర్ఘ తమస్సు |
| 105 | 22 | బ్రా ణు బయంగా | బ్రాహ్మణు బడయంగా |
| | 23 | వీరక క్షేత్రములన్ | వీర్యక క్షేత్రములన్ |
| 139 | 12 | న్వృతి తత్వం | నిర్వృతి తత్త్వం |
| 172 | 15 | నాయవా కృష్ణ | నాయనా కృష్ణ |
| 173 | 16 | అకార్ముకం | ఆ కార్ముకం |
| 190 | శీర్షిక | ఆర్జునుని | అర్జునుని |

